# శ్రీభద్రాచలరామ నక్షత్రమాల

ఇయ్యది

[illegible] ప్రభుప్రభృతి సంస్థాన సన్మానితుండగు

[illegible] శ్రీరామశాస్త్రిచే

టీకా తాత్పర్యసహితముగా రచింపబడినది.



విజయవాటికా విరాజమాన వాణీ ముద్రాలయంబునకును,

ఓరియంటల్ గవర్నమెంటు సెక్యూరిటీ భీమాకంపెనీకిని ఏజంటుగానున్న

వేలమూరి నాగభూషణముగారి ప్రోత్సాహముచే



బెజవాడ

వాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.



1932.

ప్రథమ ముద్రణము 1000 ప్రతులు.

 వెల రు 0-1-0.



కీర్తిశేషులగు

రంగావఝుల వెంకట సుబ్బయ్యా హరిదాసుగారు

# సమర్పణము.

శ్లో॥ కాకః కృష్ణః పికః కృష్ణః కోభేదః పికకాకయోః ।
వసన్తకాలే సంప్రాప్తే కాకః కాకః పికః పికః ॥

కాకియునలుపే కోకిలయునలుపే, ఇక కాకికిని కోకిలకును భేదమేమి? అనిన వసన్తకాలము వచ్చినపుడు కాకి, కాకియనియు, కోకిల కోకిలయనియు, నందరికిదెలియును అనులోకోక్తి. కావున సమయము వచ్చినప్పుడుగాని పురుషులయోగ్యత వెల్లడి కాదు. గుంటూరు మండలమున పెదరావూరనునొక చిన్నగ్రామముకలదు. అందుండు వైదికబ్రాహ్మణకుటుంబములలో రంగావఝ్ఝలవారి కుటుంబమొకటి కలదు. అందు ఉద్దండయ్యయను సద్బ్రాహ్మణోత్తమునకు వెంకటసుబ్బయ్యఅను కుమారుడుండెను. ఆవిప్రసుతుండు బాల్యముననే వేదశాస్త్రముల నభ్యసింపకున్నను జన్మాంతర సంస్కారవశమున సజ్జనులసహవాసమున మెలగుచు హరికథా కాలక్షేపములజేయ నభ్యసించెను. సంగీతమున విశేషపాండిత్యము లేకున్నను భక్తిపరవశుడై, ఈమహనీయుడు హరికథాకాలక్షేపము జేయునప్పుడు సర్వజనులును చిత్రలిఖితులవలె నిశ్చలులైయుండువారు. జీవనార్థమైయెన్నడు నీపుణ్యపురుషుడు హరికథ నుపయోగింపక సావుకారుల వ్యాపారముల సహాయముజేయుచు జీవనముగడుపుకొనుచు గన్నెరిగినవారే సందర్భమునైన కోరినప్పుడుచితముగనే హరికథ జెప్పుచుండువాడు. కాన సామాన్యుడుగనే జనులచే పరిగణింపబడువాడు. జీవనార్థమై హరికథలజెప్పుట నభ్యసించిన ఈకాలపు హరిదాసులతోపాటుగనైన వేషభాషలచే ప్రసిద్ధుడుకాడు. కానిభగవంతుని యంతరంగభక్తులగు వైష్ణవదుర్గదాసుగారు మొదలగువారు ఈతని భక్తవరుడని ఎరుగుదురు. ఈపుణ్యాత్ముడు స్వగ్రామమునవొక భజనసప్తాహమునుజేసెను. ప్రజోత్పత్తినామ సం॥ శ్రావణ శుక్లైకాదశీ సోమవారమున శ్రీమహీరమణీ ముక్తాప్రాలంబాయమానమగు కృష్ణానదియొక్క సాగరసంగమస్థలమున నున్న దివిగోపూరు గ్రామమున జగజ్జేగీయమానముగ ప్రవర్తించిన భాగవతసప్తాహమహోత్సవమున నీభక్తవరేణ్యుడు రామదాసచరిత్రమును హరికథా కాలక్షేపము చేయుచు కథామధ్యమున నొకసందర్భములో రామప్రభో! యనికేకవైచి భగవంతు నేకాకారబుద్ధితో నాహ్వానించుచు భగవదైక్యమును జెందెననుటకు తార్కాణముగ శరీరత్యాగమును జేసెను. అప్పుడీపుణ్యమూర్తి యొక్క యాంతరంగికభక్తి ఎల్లరకువెల్లడియాయెను. కావుననే

"పురుషులందుపుణ్య పురుషులువేరయా"

అనివేమన యానెను. భక్తాగ్రేసరుండగు బ్రహ్మశ్రీ రంగావఝ్ఝల వెంకటసుబ్బయ్య హరిదాసుగారి జ్ఞాపకార్థమై వారిమేనల్లుడు బ్ర. శ్రీ వేలమూరివెంకటసుబ్బయ్యగారి కుమారుడునగు "నాగభూషణ" మనుయశఃకాముడు నాచేరచింపబడి శ్రీభద్రాచల రామచంద్రప్రభువు వారిసన్నిధిని సమర్పింపబడిన "శ్రీభద్రాచలరామ సత్కీర్తనమాల"ను ముద్రణచేయించి ప్రచురించెను.

ఇట్లు
వేదాంతం శ్రీరామ శాస్త్రి,
శ్రీ భద్రాచలరామచంద్ర ప్రభువు వారి
యాస్థాన విద్వాంసుడు.

ది 26-2-1932.
భద్రాచలం.

# శ్రీ భద్రాద్రి రామ నక్షత్రమాలా

శ్లో॥ భద్రాభిధాన గిరివర్యతపఃఫలంతౌ ।
భద్రాభిధాన శతకోటిసమర్చ్యమానౌ ।
భద్రేతరాద్రి శతకోటిభిదాసమర్థౌ ।
భద్రాద్రిరామచరణౌ శరణం ప్రపద్యే॥ 1

అవతారిక॥ శ్రీరామచంద్రమూర్తి గొప్పగొప్ప కులపర్వతములుండ భద్రగిరియను చిన్న గుట్టపై నేల యధివసించెనను శంకకు సమాధానముగా నీ శ్లోకము చెప్పబడినది.

టీకా॥ భద్రా:......ఫలంతౌ=భద్ర=భద్రుడను । అభిధాన=పేరుగల।గిరివర్య=పర్వతశ్రేష్ఠముయొక్క।తపః=తపస్సునకు।ఫలంతౌ=ఫలమగుచున్నట్టియు।భద్రా......మానౌ=భద్ర=మంగళకరములైన ।అభిధాన=నామములయొక్క।శతకోటి=శతకోటియను సంఖ్యచేత।సమర్చ్యమానౌ = పూజింపబడుచున్నట్టియు భద్రే.....సమర్థౌ=భద్రేతర=అమంగళములను। అద్రిశతకోటి=అనేక పర్వతములను। భిదా=నరకుటయందు। సమర్థౌ=శక్తి కలిగినట్టియు।భద్రాద్రిరామ చరణౌ=భద్రాద్రిరాములవారి చరణములను । శరణం ప్రపద్యే=శరణము పొందెదను॥

తా॥ శ్రీరాములవారినిగురించి భద్రుడు, చిరకాలము తపమొనరింప రాములు ప్రత్యక్షమై వరంబిచ్చెద కోరుకొనుమన నాపేరాచంద్రతారార్కముగ ప్రసిద్ధినొందునట్లు ననుతలంపుతో నాతలపై తామధివసించుటయే నాకోరికయన స్వామియు నంగీకరించి వేంచేసెను గాన నెల్లప్పుడును భక్తులచేత ననేకకోట్ల నామములతో బూజింపబడుచు భక్తుల కొండలవంటి పాపములపరిహరించుచున్న భద్రాద్రి రాముల చరణముల శరణుజెందెద॥

శ్లో॥ భద్రాఖ్య భక్తవర విస్మరణస్మృతిద్ధా ।
త్యంతత్వరాపరవశత్వదయామయత్వౌ ।
ప్రఖ్యాపనాకృతి గృహీతదరారిహస్తౌ ।
భద్రాద్రిరామ చరణౌ శరణం ప్రపద్యే॥ 2

అ॥ రామచంద్రమూర్తి శంఖచక్రములను ఏలధరించెనను శంకకు సమాధానము॥

టీ॥ భద్రా...... హస్తా=భద్రాఖ్య=భద్రుడను పేరుగల | భక్త=భక్తునియొక్క | పర=పరమును సంబంధించిన | విస్మరణస్మృతి=మరపును,జ్ఞాపకమువచ్చుటయు నను వానిచేత | ఇద్ధ=వృద్ధిపొందిన | అత్యంతత్వరా=అతితొందరకు | పరవశత్వ=పరవశుడగుటను | దయామయత్వ=అతి దయగలిగియుండుటను | ప్రఖ్యాపనాకృతి=వెల్లడిచేయుటకై | గృహీత-ధరింపబడిన | దర=శంఖము | అరి=చక్రమును | హస్త=చేతులయందుగల|భద్రాద్రిరామ=ఓ భద్రాద్రియందలి రామా| చరణౌ=నీచరణములను | శరణం ప్రపద్యే=శరణుజెందెద.

తా॥ భద్రుడు చిరకాలము తపస్సుచేయుచుండగా వనవాససమయమున సీతా లక్ష్మణ సమేతుడై రామచంద్రమూర్తి వానికి దర్శనమిచ్చి యేల యిట్టి ఘోరతపము చేయుచున్నావని యడుగ, భద్రుడు స్వామీ మీనిమిత్తమేయనెను, నీకేమి యుపకారను చేయవలెనని రాములడుగ తామెల్లప్పుడును, నాతలపై నుండుటయే నాకోరికయనెను, పనిగలిగిపోవుచున్నాను మరియొకప్పుడు నీకోరిక దీర్తునని చెప్పిపోయిన రాములు రావణసంహారాదులజేసి యయోధ్యకు త్వరగా పుష్పకముపై బోవునపుడేగాక పదునొకండువేలయేండ్లు రాజ్యమేలియు నవతారసమాప్తికాలమున సైతము,భద్రుని వరమునుమరచి చతుర్బాహుడై వైకుంఠమునకు బోయినతర్వాత భద్రునివరము జ్ఞాపకమురాగా ఎంతపనిచేసితినని నొచ్చుకొనుచు, తాను చతుర్బాహువులతోడను శంఖచక్రములతోడను నున్న సంగతిని గమనింపక యారూపముతోడనే దయతో త్వరగావచ్చి భద్రగిరిపై యట్లు నిలిచెనను గాథను తెలియజేయుటకై, శంఖచక్రములధరించిన భద్రాద్రి రాముల చరణముల శరణుజెందెద॥

శ్లో॥ భక్తౌఘభక్తి పరిశీలన హేతవేను।
భల్లూక గోరిపుసమూహనివాసభూత।
భద్రాద్రికానన రసాకృత సన్నివేశ।
భద్రాద్రిరామ చరణౌ శరణం ప్రపద్యే॥ ౩

టీ॥ భక్తౌఘ॥......ను| భక్తౌఘ=భక్తసమూహముయొక్క | భక్తి=భక్తిని | పరిశీలన హేతవేను=పరీక్షచేయుటకోయనునటుల | భల్లూక......వేశ | భల్లూక=ఎలుగుబంట్లకును | గోరిపు=పులులకును | నివాసభూత=కాపురమైన | భద్రాద్రి

కానన=భద్రగిరిపైనున్న వనమునందలి । రసా=భూమియందు । కృత=చేయ బడిన । సన్నివేశ=నివాసముగల । భద్రాద్రిరామ=ఓభద్రాద్రిరాముడా । చరణౌ= నీపాదములను । శరణంప్రపద్యే-శరణుచెందెద॥

తా॥ మేము భక్తులమని వెల్లడించువారికి యెంతభక్తికలదోయని పరీక్షించుటకో యను నట్లు పులులు మొదలగుక్రూరమృగములకు కాపురమైన భద్రగిరియడవిలో వేంచే సిన యోరామా నీచరణములను శరణుజెందెదను॥

శ్లో॥ శ్రీపోకలాభిధకులే జనిమాప్తవత్యాః ।
దమ్మక్క నామక సతీజనసంఘమాలేః ।
స్వప్నేభిదర్శితనిజాగమగమ్యరూప ।
భద్రాద్రిరామ చరణౌ శరణం ప్రపద్యే॥ ౪

టీ॥ శ్రీపోకలాభిధకులే-శ్రీ=దైవానుగ్రహముచే సంపదగల । పోకలాభిధ- పోకలవారను నింటిపేరుగల । కులే=వంశమున । జనిం=పుట్టుకను । ఆప్తవత్యాః పొందిన । దమ్మక్క ......మాలేః దమ్మక్కనామక=దమ్మక్కయను పేరుగల । సతీజనసంఘ=స్త్రీ సముదాయములో । మాలేః శ్రేష్ఠురాలియొక్క । స్వప్నే=కలలో । అభి... రూప=అభిదర్శిత=చూపబడిన । నిజ=తనయొక్క । ఆగమగమ్య=వేదశాస్త్ర ములచే నూహింపబడిన । రూప=దివ్యమంగళవిగ్రహముగల । భద్రాద్రిరామ-ఓ భద్రగిరిరామా । చరణౌ నీచరణములను । శరణంప్రపద్యే=శరణుచెందెదను.

తా॥ త్రేతాయుగమున భద్రగిరిపై వెలసిన స్వామి నెవరెవరుకోరుమున నారా ధించిరోకాని కలియుగమున పోకల దమ్మక్కయ సతీతిలకమునకు కలలో గనపడినాటినుండియు నామెచే నారాధింపబడిన దివ్యమంగళ విగ్రహముగల ఓ భద్రగిరిరామా నీచరణముల శరణుజెందెదను ॥

శ్లో॥ శాఖమ్రుగాదహరహఃపతితంతుమహ్యం ।
శాఖంనివేదయభవే త్తతపవత్రృప్తిః ।
వాత్యహ్నాత్యపై నమథతత్కృతస్తృత్యత్రృప్త ।
భద్రాద్రిరామచరణౌశరణంప్రపద్యే॥ ౫

టీ॥ చ=ఇంతేగాక । శాఖద్రుమాత్=శాటిచెట్టునుండి । అహరహః=ప్రతిదినము ను పతితం=రాలిన । శాఖంతు=శాటిపండునుమాత్రము । మహ్యం=నాకొరకు ।

నివేదయ=నివేదనచేయుము। ఏవం=ఈవిధముగా। వ్యాహృత్య=అదమ్మక్కకు కలలో చెప్పి। అథ=తరువాత। తత్కృతకృత్యతృప్త=ఆమెచే నటులజేయ బడిన యారాధనచేత తృప్తిజెందిన। భద్రాద్రిరామ=ఓ భద్రగిరిరామా। చరణౌ=నీ చరణములను। శరణంప్రపద్యే=శరణుజెందెదను ॥

తా॥ కలలో దమ్మక్కకు దర్శనమిచ్చుటయేకాక "నేను భద్రగిరిపై వెలసితినిగాన నన్నారాధింపు" మని యామెతో ననగా "దరిద్రురాలనగు నేను మిమ్ముల నేలాగున నారాధింపగల" నని యామెయన "నాకెదురుగనున్న తాటిచెట్టు నుండి ప్రతిదినమును నొకపండురాలును। దానిని నివేదనచేయుమని యానతిచ్చి యామెచేత నటులనే యారాధింపబడి తృప్తిజెందిన దయామయుడా భద్రాద్రి రామా నీచరణముల శరణుజెందెదను ॥

శ్లో॥ కంచర్ల గోపన మనీషివరేణ్యచిత్త।
రోలంబజీవన మరందఝరీప్రపూర్ణా।
శ్రీతూముమంశ్య నరసింహమనస్సరస్థా।
భద్రాద్రిరామచరణౌశరణంప్రపద్యే. 6

టీ॥ కంచర్ల.........పూర్ణా=కంచర్ల గోపనమనీషివరేణ్య=కంచర్ల గోపన్న యను పండితతిలకునియొక్క, చిత్తరోలంబ=మనస్సను తుమ్మెదయొక్క, జీవన=జీవించుట కాధారమైన, మరంధఝరీ=మకరంద ప్రవాహముతో ప్రపూర్ణా=నిండినట్టియు। శ్రీతూము ........స్థా=శ్రీతూమువంశ్య=శోభా యుక్తమగు తూమువారను వంశమునబుట్టిన। నరసింహ = నరసింహదాను యొక్క। మనస్సరస్థా=మనస్సను సరోవరమున నుండునట్టి। భద్రాద్రి...... చౌ=భద్రాద్రిరాముల చరణములను। శరణంప్రపద్యే=శరణుజెందెదను ॥

తా॥ దమ్మక్కయనంతరమున రామదాసని జగత్ప్రసిద్ధిగాంచిన కంచర్లగోపన్న చేతను తరువాత తూము నరసింహదాసుచేతను నారాధింపబడిన భద్రాద్రి రాముల చరణముల శరణుజెందెదను ॥

శ్లో॥ శ్రీగోపురాది కరణామహ్యతేశవిత్త।
భక్తేశబంధ వినివారణకారణాయ।
మాయాగృహీత యువకింకరవర్యరూప।
భద్రాద్రిరామ చరణౌశరణంప్రపద్యే. 7

టీ॥ శ్రీగోపుర.. ..... య=శ్రీ=శోభాయుక్తములైన, గోపురాది=గోపురము మొదలగువానిని, కరణాయ=నిర్మించు నిమిత్తము। హృతేశ.........య=హృత=హరింపబడిన । ఈశ=రాజుయొక్క, విత్త=ధనముగల, భక్తేశ=భక్తశ్రేష్ఠుడగు రామదాసుయొక్క । బంధవినివారణకారణాయ=ఖైదునుండివిడిపించుటకై। మాయా....... రూప=మాయా=మాయచేత। గృహీత=గ్రహింపబడిన। యుపకింకర=పడుచు జవానుయొక్క। రూప=ఆకారముకలవాడా। భద్రాద్రిరామ- ఓభద్రగిరిరామా । చరణౌ=నీపాదములను । శరణంప్రపద్యే=శరణుజెందెదను ॥

తా॥ భద్రగిరియందు దేవాలయగోపుర ప్రాకారాదుల గట్టించుటకు 'తానీషా' సొత్తు నపహరించి వానిచే ఖైదుచేయబడినరామదాసుని చెరవిడిపించుటకై మాయచే పడుచు జవానురూపము ధరించిన భద్రగిరిరామా నీచరణముల శరణుజెందెదను.

శ్లో॥ కైంకర్యమూల్య ముపనీయపతిం నరాణాం।
సమ్మోహ్యభక్తవిషపాత్రహృతింవిధాయ ।
నిర్వ్యూఢభక్త పరిపాల భద్రదీక్ష ।
భద్రాద్రిరామ చరణౌశరణంప్రపద్యే. 8

టీ॥ కైంకర్యమూల్యం=రామదాసు చేసినకైంకర్యపు ఖరీదును। ఉపనీయ=తీసికొనిపోయి । నరాణాంపతిం=రాజగు తానీషాను । సమ్మోహ్య=వంచనచేసి । భక్తవిషపాత్ర హృతిం=భక్త=భక్తుడగు రామదాసుయొక్క । విషపాత్రహృతిం- విషపుగిన్నెను పడద్రోయుటను । విధాయ=చేసి । నిర్వ్యూఢదీక్ష- నిర్వ్యూఢ=నిర్వహింపబడిన । భక్తపరిపాలన=భక్తులను పాలించుటయను। భద్రదీక్ష=మంగళకరమగు దీక్షగల। భద్రాద్రిరామ= ఓభద్రగిరిరామా। చరణౌ=నీపాదములను। శరణంప్రపద్యే=శరణుజెందెదను।

తా॥ దేవాలయ ప్రాకారాదుల గట్టించుటకైన యారులక్షలును గొనిపోయి తానీషాతో రామదాసు పంపిన జవానునని చెప్పి తన నిజరూపమును దెలియనీయక మోసగించి రామదాసు తనను కాపాడలేదని విసిగి త్రాగుటకై వద్ద నిడుకొని నిద్రింప నావిషపాత్రను బోర్లద్రోసి భక్తపరిపాలనమను దీక్షను నిర్వహించిన భద్రగిరిరామా నీచరణముల శరణుజెందెదను॥

శ్లో॥ భక్తౌఘరాడ్వరదపూర్వకరామదాస ।
పూర్వార్జితాలఘుతపః ఫలభూతదివ్య ।
శ్రీమద్విభూతియుతరమ్య శరీర యుక్త ।
భద్రాద్రిరామ చరణౌ శరణంప్రపద్యే॥ 9

టీ॥ భక్తౌఘ ........యుక్త=భక్తౌఘరాట్=భక్తసంఘమున శ్రేష్ఠుడగు। వరదపూర్వకరామదాస=వరదరామదాసుచేత। పూర్వార్జిత=వెనుకటిజన్మలలో సంపాదింపబడిన। అలఘు=గొప్పదగు। తపఃఫల భూత=తపస్సునకు ఫలమైనట్టియు। దివ్య శ్రీమద్విభూతియుత=దేవతా సంపదలతోడను, విభూతితోడను గూడిన। రమ్య=మనోహరమగు। శరీరయుక్త=దేహముతో గూడినవాడా। భద్రాద్రిరామ=ఓ భద్రగిరిరామా। చరణౌ=నీపాదములను। శరణంప్రపద్యే=శరణుజెందెదను॥

తా॥ గొప్పనైతరువాత భక్తజనాగ్రగణ్యుండగు వరదరామదాసుచేత నారాధింపబడి ఆతనిచేత పూర్వపుణ్య మూర్తిరూపము నొందకాబోలుననుకొనదగి నిత్యలీలావిభూతులతో గూడిన దేహముగల భద్రగిరిరామా నీ చరణముల శరణు జెందెదను॥

శ్లో॥ శ్రీవెంకటాద్రిరమణాభిధ సాధువర్య ।
నిత్యాన్నదాన నియమస్యధురంవహంతౌ ।
బంభ్రమ్యమాణ మునిమానసచంచరీకౌ ।
భద్రాద్రిరామ చరణౌ శరణంప్రపద్యే ॥ 10

టీ॥ శ్రీవెంకటా ..... మస్య=శ్రీవెంకటాద్రిరమణ=శ్రీ వేంకటరమణయ్యయను। అభిధ=పేరుకల। సాధువర్య=సజ్జనశ్రేష్ఠునియొక్క। నిత్యాన్నదాననియమస్య=ఎప్పుడు నన్నదానము చేయుటయను నియమముయొక్క। ధురం=భారమును। వహంతౌ=వహించుచున్నట్టియు। బంభ్రమ్య ... రీకౌ=బంభ్రమ్యమాణ=అధికముగ ముసురుకొనుచున్న। మునిమానస=మునుల చిత్తములను। చంచరీకౌ=తుమ్మెదలుగల। భద్రాద్రిరామచరణౌ=భద్రగిరిరాముల చరణములను। శరణంప్రపద్యే=శరణు జెందెదను॥

తా॥ వరదరామదాసుగారి తర్వాతపమిడిఘంటం వెంకటరమణహరిదాసుగారిచే నారాధింపబడి శేయింబవళ్ళు లేదనకుండ నన్నిజాతులకు నన్నమిడనలెనను యా

భక్తునివ్రతముయొక్క భారమును తామే వహించి స్థిరవసతులేమియు లేకున్నను నేటికిని నాస్త్రమును నయాచితముగ నడుపుచున్న భద్రగిరిరాముల పాదముల జెందెద॥

శ్లో॥ దంభోళిచక్రసరసీరుహశంఖచిహ్నౌ ।
శంభుస్స్వయంభు సురనాయక సేవ్యమానౌ ।
దంభాదిదోష పరిదూషిత దుర్లభౌతౌ ।
భద్రాద్రిరామచరణౌ శరణంప్రపద్యే॥ 11

టీ॥ దంభోళి ......చిహ్నౌ=దంభోళి=వజ్రము। చక్ర=చక్రము। సరసీరుహ=పద్మము। శంఖ=శంఖము అను। చిహ్నౌ=రేఖలుకల్గినట్టియు। శంభు ....మానౌ=శంభు=శివుడు। స్వయంభు=బ్రహ్మ। సురనాయక=ఇంద్రుడు ననువారిచేత। సేవ్యమానౌ=సేవింపబడుచున్నట్టియు। దంభాది=బడాయి మొదలగు। దోష=దుర్గుణములచేత। పరిదూషిత=చెడగొట్టబడినవారలకు। దుర్లభౌ=లభింపనట్టియు। తౌ=ప్రసిద్ధములైన। భద్రాద్రిరామచరణౌ=భద్రగిరిరాముల పాదములను। శరణంప్రపద్యే=శరణుజెందెదను॥

తా॥ వజ్ర,చక్ర, పద్మ, శంఖ, రేఖలుగల్గి శివబ్రహ్మేంద్రులచే సేవింపబడుచు కామక్రోధాధులకు చిక్కి చెడినవారికి మాత్రము లభింపని భద్రగిరిరాముల చరణముల శరణుజెందెదను॥

శ్లో॥ ప్రాతఃప్రబుద్ధకమలోదరపత్రతుల్యౌ।
ప్రాతస్స్మృతింవిదధతాంభవసంతతిఘ్నౌ।
ప్రాలేయపర్వతసుతాపతిమానసస్థౌ।
భద్రాద్రిరామచరణౌ శరణంప్రపద్యే॥ 12

టీ॥ ప్రాతః.....తుల్యౌ=ప్రాతః=ఉదయకాలమున। ప్రబుద్ధ=విచ్చిన। కమల=పద్మమండలి। ఉదరపత్ర=లోపలి రేకులతో। తుల్యౌ=సమానములైనట్టియు। ప్రాతస్స్మృతిం=నిద్రమేల్కొనగనే తలచుకొనుటను।విదధతాం=చేయువారియొక్క।భవసంతతి=జననమరణప్రవాహమును। ఘ్నౌ=నాశముచేయునట్టియు। ప్రాలేయ.....స్థౌ=ప్రాలేయపర్వత సుతాపతి=పార్వతీపరమేశ్వరులయొక్క। మానసస్థౌ=మనమునందున్నట్టియు। భద్రాద్రిరామచరణౌ=భద్రగిరిరాముల చరణములను। శరణంప్రపద్యే=శరణుజెందెదను॥

తా॥ అప్పుడే విచ్చిన కమలములోపలి రేకులవలె మృదువులై కాంతికలవై, నిద్రలేవగనే తమ్ము తలచుకొనువారికి జననమరణములు లేకుండ జేయుచు పార్వతీపరమేశ్వరుల మానసమున నెలకొనియున్న భద్రగిరిరాముల పాదముల శరణుజెందెదను॥

శ్లో॥ శ్రీగౌతమాఖ్యముని ముఖ్యసతీలలాసు ।
సంప్రాప్తశాపవినివర్తనలబ్ధవర్ణౌ ।
పద్మచ్ఛవిచ్ఛురితరమ్యతమస్వరూపౌ ।
భద్రాద్రిరామచరణౌ శరణం ప్రపద్యే ॥ 13

టీ॥ శ్రీగౌతమా........వర్ణౌ=శ్రీ=తపశ్శోభాయుక్తుడగు। గౌతమాఖ్య=గౌతముడను పేరుగల। మునిముఖ్య మునిసత్తమునియొక్క। సతీలలామ-పత్నియగు అహల్యచేత। సంప్రాప్త-పొందబడిన। శాప=శాపమును। వినివర్తన-విమోచన చేయుటచేత। లబ్ధ=పొందబడిన। వర్ణౌ=ప్రశస్తికలిగినట్టియు। పద్మ..... రూపౌ=పద్మచ్ఛవి=కమలములకాంతివంటి కాంతితో। ఛురిత=కప్పబడి। రమ్యతమ=అతిరమణీయమైన। స్వరూపౌ=ఆకారముకల్గినట్టియు। భద్రాద్రిరామచరణౌ=భద్రగిరిరాముల పాదములను। శరణంప్రపద్యే=శరణుజెందెదను॥

తా॥ గౌతమపత్నియగు అహల్యకు శాపవిమోచనముచేసి ప్రసిద్ధిజెందిన, కమలముల కాంతివంటి కాంతిగల్గిన భద్రగిరిరాములపాదముల శరణుజెందెదను.

శ్లో॥ సీతాసతీమృదులపాణి సరోజయుగ్మ।
సంవాహితౌ జనకభూపతిపాణిమృష్టౌ।
తత్పూర్వమేవగుహనామక భక్తమృష్టౌ।
భద్రాద్రిరామచరణౌ శరణం ప్రపద్యే॥ 14

టీ॥ సీతా.....హితౌ=సీతాసతీ=సీతాదేవియొక్క। మృదుల=మెత్తని। పాణి సరోజ=కమలములవంటి చేతులతో। సంవాహితౌ=పిసుకబడినట్టియు। జనక.....మృష్టౌ=జనకభూపతి=జనకమహారాజుచేత। మృష్టౌ=కడుగబడినట్టియు। తత్పూర్వమేవ=అంతకుమునుపే। గుహ.....మృష్టౌ=గుహనామక=గుహుడను పేరుగల। భక్త=భక్తునిచేత। మృష్టౌ=కడుగబడినట్టియు। భద్రాద్రిరామచరణౌ=భద్రగిరిరాములపాదములను। శరణంప్రపద్యే=శరణుజెందెదను।
...

తా॥ సీతామహాదేవియొక్క మెత్తని చేతులతో బిసుకబడునట్టియు, కన్యాదానకాలమున జనకునిచే ప్రక్షాళన చేయబడినట్టియు, పుణ్యముపండిన గుహునిచేత సీతాజనసులకంటె ముందుగ స్పృశించి కడుగబడినట్టియు భద్రాద్రిరాములపాదముల శరణుజెందెదను॥

శ్లో॥ వాలిప్రభంజనజలక్ష్మణ సూర్యపుత్ర।
సంపూజితావరుణ నీరజతుల్యరూపౌ।
గోదావరీపులినభూమికృతాత్మముద్రౌ।
భద్రాద్రిరామచరణౌ శరణంప్రపద్యే॥ 15

టీ॥ వాలి......జితౌ=వాలిప్రభంజనజ=అంగద హనుమంతులచేతను। లక్ష్మణ=లక్ష్మణస్వామిచేతను।సూర్యపుత్ర=సుగ్రీవునిచేతను। సంపూజితౌ=పూజింపబడినట్టియు। అరుణ .. ..పౌ=అరుణనీరజ=ఎఱ్ఱదామరపూలతో।తుల్య=సమమగు। రూపౌ=స్వరూపముగల్గినట్టియు। గోదావరీ .....ముద్రౌ=గోదావరీ=గోదావరియందలి। పులినభూమి=ఇసుకతిన్నెలయందు। కృత=చేయబడిన। ఆత్మముద్రౌ=తమముద్రలు కల్గినట్టియు। భద్రాద్రిరామచరణౌ=భద్రగిరిరాముల పాదములను। శరణం ప్రపద్యే=శరణుజెందెదను॥

తా॥ హనుమదంగదలక్ష్మణులచేతను సుగ్రీవునిచేతను పూజింపబడి రక్తకమలములవలె శోభిల్లుచు గోదావరియందలి యిసుకతిన్నెలపై సంచరించుటచేత ముద్రవేసినట్లంటుకొనిన జాడలుగల భద్రగిరిరాముల పాదములశరణుజెందెదను॥

శ్లో॥ పద్మానివాసముకుళీకరణోత్థదోష।
శాంత్యైశశాంకశకలై రివసేవ్యమానౌ।
శశ్వన్నఖై రమలకాంతియుతై రుపేతౌ।
భద్రాద్రిరామచరణౌశరణంప్రపద్యే॥ 16

టీ॥ పద్మ ... ... శాంత్యై=పద్మానివాస = ఇందిరామందిరములగు కమలములయొక్క। ముకుళీకరణ=ముడుచుకొనజేయుటచేత। ఉత్థ=కలిగిన।దోష=పాపముయొక్క। శాంత్యై=శమించుటకొరకు। శశాంకశకలైః=చంద్రఖండములచేత। శశ్వత్=ఎల్లపుడును। సేవ్యమానావివ=కొలువబడుచున్నవోయనుకొనునట్లులనున్నట్టియు। అమల......తైః=అమలకాన్తి=తెల్లనికాంతితో। యుతైః=

కూడుకొనిన| నఖై ః=గోళ్ళతో|ఉపేతా=కలిసికొనియున్నట్టియు |భద్రా...
ణౌ=భద్రగిరిరాములపాదములను| శరణంప్రపద్యే=శరణుజెందెదను||

తా|| లక్ష్మి కాపురముండు కమలముల ముడుచుకొనజేయుటచే గలిగినదోషమును పోగొట్టుకొనుటకు చంద్రుడు శ్రీరాములపాదసేవ నెల్లప్పుడును చేయుచున్నా డేమో యనుకొనదగిన తెల్లనికాంతిగల గోళ్ళుగల భద్రగిరీశుని| పాదముల శరణుజెందెదను||

శ్లో|| శశ్వద్బుధై ర్మరకతప్రతిమానకాంతి|
యుక్తాతిసంఖ్య తులసీదళపూజ్యమానౌ|
ముక్తాభిరామనఖశోభిశుభాంగుళీకౌ|
భద్రాద్రిరామచరణౌ శరణం ప్రపద్యే|| 17

టీ|| శశ్వత్=ఎల్లప్పుడును| బుధైః=దేవతలచేతను| పండితులచేతను | మరకత......నౌ=మరకతప్రతిమాన=మరకతమణులబోలిన | కాంతియుక్త=కాంతితోగూడిన అతిసంఖ్య=అనేకములగు| తులసీదళ=తులసీదళములతో| పూజ్యమానౌ=పూజింపబడుచున్నటువంటివిన్ని| ముక్తా ...... కౌ=ముక్త=ముక్తపురుషులవలెనున్న ముక్తా=ముత్యములవలె| అభిరామ=రమ్యములైన| నఖ=గోళ్ళతో| శోభి=ప్రకాసించుచున్న| శుభాంగుళీకా= చక్కనివ్రేళ్ళుగలిగిన| భద్రాద్రిరామచరణౌ=భద్రగిరీశునిపాదములను| శరణంప్రపద్యే=శరణుజెందెదను||

తా|| ఎల్లవేళల దేవతలచేతను పండితులచేతను మరకతమణులవంటి కాంతిగల అనేక తులసీదళములతో బూజింపబడుచు ముక్తపురుషులవలెను ముత్యములవలెను స్వచ్ఛముగ బ్రకాశించుచున్న గోళ్ళతో నందముగానుండు వ్రేళ్ళుగల భద్రాద్రి రాముల చరణముల శరణుజెందెదను||

శ్లో|| సవ్యాపసవ్యకరధారితచక్రశంఖ|
సంసూచితాత్మపరపూరుష వైభవాది|
సంతారితాఖిల శరీరి శరీరభూత|
భద్రాద్రిరామచరణౌ శరణంప్రపద్యే|| 18

టీ|| సవ్యా.....భూత= సవ్య= ఎడమదియైనట్టియు| అపసవ్య=కుడిదియైనట్టియు కర=చేతులచేత| ధారిత=ధరింపచేయబడిన| చక్రశంఖ=చక్రశంఖములచేత

సంసూచిత=సూచనచేయబడిన। ఆత్మ=తనయొక్క।పరపూరుషవై ౘనాది=పరమ పురుషత్వము మొదలగువానిచేత । సంతారిత=తరింపచేయబడిన । అఖిలశరీరి= సర్వజీవులయొక్కయు । శరీరభూత=శరీరమైన । భద్రాద్రిరామ=ఓ భద్రగిరి రామా । చరణౌ=నీచరణములను । శరణంప్రపద్యే=శరణుజెందెదను.

తా॥ ఎడమచేత చక్రమును కుడిచేత శంఖమును ధరించి తాను పరమపద నాథుడ ననియు దయామయుడననియు తెలియజేయుచు ఆవిషయమును తెలిసికొని దర్శ నముచేయు జీవులదరింపజేయుచున్న సర్వజగన్మయుడవగు నో భద్రగిరిరామా నీ చరణముల శరణుజెందెదను.

శ్లో॥ వామాంకసంస్థ ధరణీతనయాభిరామ ।
పాణిద్వయాత్త శరచాపమనోభిరామ ।
పార్శ్వస్థితేంద్ర జిదసుప్రహరాభిరామ ।
భద్రాద్రిరామ చరణౌ శరణంప్రపద్యే ॥ 19

టీ॥ వామాంక......రామ=వామాంక = ఎడమతొడపైన సంస్థ=ఉన్న । ధరణీతన యా=సీతాదేవిచేత । అభిరామ=మనోహరుడా । పాణి......రామ=పాణిద్వ య=రెండుచేతులతో । ఆత్త=గ్రహింపబడిన। శరచాప= శరశరాసనములచేత । మనోభిరామ=అందమైనవాడా । పార్శ్వ.....రామ=పార్శ్వ=ప్రక్కను । స్థిత=ఉన్న । ఇంద్రజిదసురప్రహర=లక్ష్మణస్వామిచేత । అభిరామ- ఇంపుగలు వవాడా । భద్రాద్రిరామ=ఓ భద్రగిరిరామా । చరణౌ=నీచరణములను । శర ణంప్రపద్యే=శరణుజెందెద॥

తా॥ ఎడమతొడపై సీతనిడుకొని యొకచేత విల్లును నొకచేత బాణమునుధరించి ప్ర క్కను లక్ష్మణుడుండ లోకాభిరాముడవగు నో భద్రగిరిరామా నీచరణముల శరణుజెందెదను.

శ్లో॥ ప్రాసాదమధ్యమణి పీఠవిరాజమాన ।
వైదేహరాజతనయా మృగధేంద్రపుత్రీ ।
సంజాతసమ్యగుపసేవిత వామభాగ ।
భద్రాద్రిరామ చరణౌశరణంప్రపద్యే ॥ 20

టీ॥ ప్రాసాద... ..మాన=ప్రాసాదమధ్య = ఆలయమునడుమనున్న | మణిపీఠ=రత్న సింహాసనమున | విరాజమాన=ప్రకాశించువాడా | వైదేహ......భాగ వైదేహరాజ=జనకునియొక్క | తనయా=కూతుచేతను | మగధేంద్ర=మగధ రాజుయొక్క|పుత్రీ=కూతురగు సుమిత్రకు| సంజాత=కొడుకైన లక్ష్మణునిచేతను | సమ్యక్=బాగుగా | ఉపసేవిత=ఆశ్రయింపబడిన | వామభాగ=ఎడమవైపుగలవాడా | భద్రాద్రిరామ=ఓభద్రగిరిరామా | చరణౌ=నీచరణములను | శరణం ప్రపద్యే=శరణుజెందెదను.

తా॥ దేవాలయమధ్యమున్న మణిపీఠముపై సీతా లక్ష్మణులు వామభాగమున సేవింపుచుండ దేదీప్యమానుండవగు నో భద్రగిరిరామా నీచరణముల శరణుజెందెదను.

శ్లో॥ కృత్వాతపః పరమ దుర్లభమంతరాయా ।
త్తానీషనామ కలితోభువియోజజాన ।
తత్తానిషాఖ్యయవనేశకృతోపచార ।
భద్రాద్రిరామచరణౌ శరణంప్రపద్యే ॥ 21

టీ॥ యః=ఎవడు | పరమదుర్లభం=అతిదుస్సాధ్యమగు | తపః=తపస్సును | కృత్వా చేసి | అంతరాయాత్=విఘ్నమువలన | భువి=భూమియందు | తానీషనామకలితః=తానీషయను పేరుతోకూడినవాడై| జజాన=పుట్టెనో | తత్తానిషాఖ్య...చార | తత్=ఆ|తానిషాఖ్య=తానిషయను పేరుగల| యవనేశ=యవనరాజుచేత| కృత=చేయబడిన| ఉపచార = కైంకర్యముగల | భద్రాద్రిరామ = ఓభద్రగిరి రామా | చరణౌ=నీచరణములను | శరణంప్రపద్యే=శరణుజెందెదను.

తా॥ ఏమహనీయుడు దుర్లభమగు తపముచేసి ఏదియో విఘ్నమగుటవలన యవనరాజై పుట్టెనో యాతానీషాచేత చేయబడిన కైంకర్యముగల భద్రగిరిరామా నీ చరణముల శరణుజెందెదను.

శ్లో॥ అద్యాపితత్కుల పరంపరయాధికారీ ।
యద్భక్తిభావకలితః కిలపాతిరాజ్యం ।
తౌనాస్తికాన పినదాస్తికతాంనయంతౌ ।
భద్రాద్రిరామచరణౌ శరణంప్రపద్యే ॥ 22

టీ॥ అద్యాపి=ఇప్పటికిని । తత్కాల......రయా। తత్కాల=ఆతానీషాకులమున।పరం పరయా=తరములవరుసచేత । అధికారీ = రాజ్యాధికారముగలవాడు । యద్భక్తి భావ=ఏభద్రగిరిరాములయందలి భక్తితో । కలితః=కూడుకొనినవాడై।రాజ్యం-రాజ్యమును । పాతికిల = ఏలుచున్నాడుగదా । నాస్తికానపి= వేదశాస్త్రములు ప్రమాణములు కావని వారలను కూడ । సదాస్తికతాం=మంచియాస్తికులగుటను । నయంతౌ=పొందించుచున్న । తౌభద్రాద్రిరామ చరణౌ=ఆభద్రగిరి రాముల చరణములను । శరణంప్రపద్యే=శరణు చెందెదను.

తా॥ ఇప్పటికిని వేదశాస్త్రములుప్రమాణములుకావను యవనులలోనివాడగు తానీషా రాజ్యాధికారి రామభక్తియుతుడై రాజ్యమేలునటులజేసి నాస్తికులను సైతము గొప్ప యాస్తికులనుగాజేయు భద్రగిరిరాముల చరణముల శరణుజెందెదను.

శ్లో॥ ప్రాతఃప్రబుధ్యకృత మంగళతూర్య ఘోషైః ।
స్నానాగ్నిహోత్ర ముఖకర్మసమాప్యపశ్చాత్ ।
తౌర్యత్రికేచలతి సంశ్రితరాజపీఠ ।
భద్రాద్రిరామ చరణౌశరణం ప్రపద్యే. 23

టీ॥ కృత........ఘోషైః=కృత=చేయబడిన । మంగళతూర్య=మంగళవాద్యము లయొక్క । ఘోషైః=ధ్వనులతో । ప్రాతఃప్రబుధ్య=ప్రొద్దునమేల్కొని। స్నానాగ్ని.........కర్మ=స్నాన = స్నానము । అగ్నిహోత్ర=ఔపాసనము । ముఖ=మొదలగు। కర్మ=వైదికకర్మను। సమాప్య=నెరవేర్చి। పశ్చాత్-పిమ్మట। తౌర్యత్రికే=నృత్యగీతవాద్యము । చలతి=జరుగుచుండగా । సంశ్రితరాజపీఠ= సంశ్రిత=అధిష్ఠింపబడిన । రాజపీఠ=సింహాసనముకలవాడా। భద్రాద్రిరామ= ఓ భద్రగిరిరామా । చరణౌ=నీపాదములను। శరణంప్రపద్యే=శరణుజెందెదను.

తా॥ మేలుకొల్పులతోడను మంగళవాద్య ధ్వనులతోడను ప్రొద్దుననే మేల్కొని స్నానాగ్నిహోత్రాదుల జేసికొనినపిమ్మట నృత్యగీతవాద్యములుజరుగుచుండగ సింహాసనము నధిష్ఠించి ప్రభుత్వోత్సవమున బ్రకాశించు నోభద్రగిరిరామ నీ చరణముల శరణుజెందెదను.

శ్లో॥ సింహాసనం జనకజానుజసేవ్యమాన ।
మాస్థాయచామరముఖాఖిల రాజలక్ష్మ ।

దేదీప్యమాన సకలాభరణాభిరామ ।
భద్రాద్రిరామ చరణౌ శరణం ప్రపద్యే. 24

టీ॥ జనక.. మానం, జనకజా=సీతాదేవిచేతను । అనుజ=తమ్ముడగు సౌమిత్రిచేతను। సేవ్యమానం=సేవింపబడుచున్న । సింహాసనం = సింగపుపీఠమును। ఆస్థాయ=ఎక్కి, చామర......మాన=చామరముఖ=వింజామరలు మొదలగు। అఖిల=సమస్తములైన రాజ్యలక్ష్మ=రాజచిహ్నలచేత । దేదీప్యమానః మిక్కిలి ప్రకాశించువాడా । సకలా......రామ=సకల=సమస్తమైన । ఆభరణ=నగలచేత । అభిరామ=ఇంపగువాడా । భద్రాద్రిరామ=ఓభద్రగిరిరామా।చరణౌ=నీపాదములను శరణంప్రపద్యే=శరణుజెందెదను.

తా॥ సీతాలక్ష్మణులు సేవింపుచుండ సింహాసనమునధిపసించి చామరములు మొదలగు సకల రాజచిహ్నములతోడను సమస్తాభరణములతోడను ప్రభుత్వోత్సవమున ప్రకాశించు నో భద్రగిరిరామా నీచరణముల శరణుజెందెదను.

శ్లో॥ మధ్యే ప్రభుత్వమహమేననిజాపదాన ।
గాన ప్రవీణజనతాకృతనృత్యవాద్య ।
సేవా ప్రమోద పులకాంకితదేహధారిన్ ।
భద్రాద్రిరామ చరణౌ శరణంప్రపద్యే. 25

టీ॥ మధ్యే ప్రభుత్వమహమేవ-ప్రభుత్వోత్సవమధ్యముననే । నిజాప......ధారిన్=నిజ=స్వీయమగు । అపదాన=చరిత్రయందలి । గాన-పాటలయందు । ప్రవీణ=నిపుణమగు । జనతా=జనసమూహముచేత । కృత=చేయబడిన । నృత్యవాద్య =నాట్యవాద్యములయొక్క।సేవా=సేవవలనగలిగిన।ప్రమోద-సంతోషమువల్లనైన। పులక-గగుర్పాటుచేత । అంకిత-చిహ్నితమైన । దేహధారిన్-శరీరమును ధరించుచున్నవాడా । భద్రాద్రిరామ-ఓభద్రగిరిరామా। చరణౌ-నీపాదములను। శరణం ప్రపద్యే=శరణుజెందెదను.

తా॥ ప్రభుత్వోత్సవము జేరుగుచుండగ రామాయణకీర్తనలబాడ నేర్పుగలజనులచే జేయబడు నృత్యవాద్యసేవ వలన గలిగిన సంతోషమును సూచించు గగుర్పాటుగల ఓభద్రగిరిరామా నీచరణముల శరణుజెందెదను.

శ్లో॥ శ్రీవైష్ణవోక్తకలపాశురజాలసేవా
స్వీకారకార్యసమనంతర భవ్యబాల।
భోగప్రణున్నజఠరోదిత జాతవేద।
భద్రాద్రిరామచరణౌ శరణం ప్రపద్యే. 26

టీ॥ శ్రీ వైష్ణ.....వే–శ్రీ వైష్ణవోక్త - శ్రీవైష్ణవులచే జెప్పబడిన, కల - అవ్యక్త మధురములగు । పాశురజాలసేవా - ద్రవిడ వేదపారాయణము కైంకర్యము యొక్క । స్వీకార కార్యసమనంతర-గ్రహించుటయను పనిదైన తర్వాతనైన భవ్యబాలభోగ-యోగ్యమగు బాలభోగముచేత । ప్రణున్న - తొలగింపబడిన । జఠరోదిత జాతవేద - ఆకలిగలవాడా । భద్రాద్రిరామ - ఓభద్రగిరిరామా । చరణౌ - నీచరణములను । శరణం ప్రపద్యే = శరణుజెందెదను॥

తా॥ శ్రీవైష్ణవులు అవ్యక్తమధురముగ ద్రవిడ వేదపారాయణముచేసిన పిదప జరుగు బాలభోగముచే దీర్చుకొనబడిన యాకలిగల యో భద్రగిరిరామా నీచరణముల శరణు జెందెదను॥

శ్లో॥ మధ్యాహ్నతూర్య రవసూచిత రాజభోగ।
కాలోత్సవ ప్రముదితాఖిల భక్తలోక ।
జేగియమాన రసగేయ బహుప్రబంధ ।
భద్రాద్రి రామచరణౌ శరణం ప్రపద్యే॥ 27

టీ॥ మధ్యాహ్న......ప్రబంధ-మధ్యాహ్న–మధ్యాహ్న కాలమునందలి । తూర్య రవ–నగారాధ్వనిచేత।సంసూచిత–సూచనజేయబడిన। రాజభోగకాల=రాజభోగ సమయమందలి। ఉత్సవ=ఉత్సవముచేత। ప్రముదిత--సంతసించిన। అఖిల=సమస్తమైన।భక్తలోక=భక్తుల సముదాయముచేత। జేగీయమాన=అధికముగా పాడబడుచున్న । రసగేయ=నవరసములచే కొనియాడదగిన । బహుప్రబంధ=నానావిధములగు గేయప్రబంధములుకలవాడా । భద్రాద్రిరామ=ఓ భద్రగిరిరామా । చరణౌ=నీచరణములను । శరణంప్రపద్యే=శరణుచెందెదను ॥

తా॥ మధ్యాహ్నకాలమున జరుగు రాజభోగమును సూచనజేయు నగారాధ్వని వినినతోడనే యతిసంభ్రమముతో సేవాకాలమునకువచ్చిన నిఖిల భక్తులచేతనుపాడబడు రసోత్తరమ్ములగు నానావిధకీర్తనలచే స్తోత్రముజేయబడు ఓ భద్రగిరిరామా నీచరణముల శరణుజెందెదను॥

## ఫలశ్రుతి

శ్లో॥ వేదాంతవంశజనిమాత్రగుణేనభక్త్యా ।
శ్రీరామనామకకవినాకృతఖేటమాలా ।
భద్రాద్రిరామచరణార్పణకారణేన ।
భద్రాణియచ్ఛతిసదాపఠతాంనరాణాం ॥ 28

టీ॥ వేదాం... ..గుణేన వేదాంతవంశ=వేదాంతమను నింటిపేరుగల వంశమున ॥ జనిమాత్ర=పుట్టుటమాత్రమే । గుణేన=విశేషముగల । శ్రీరామనామకవినా=శ్రీరాముడను పేరుగల కవిచేత । కృతఖేటమాలా=రచింపబడిన యీ నక్షత్రమాల । భక్త్యా=భక్తితో। భద్రాద్రి......ణేన భద్రాద్రిరామ=భద్రగిరిరాముల యొక్క । చరణ=పాదములయందు । అర్పణకారణేన=సమర్పింపబడిన కారణమున । పఠతాం నరాణాం=దీని పఠించు జనులకు । సదా=ఎల్లప్పుడును । భద్రాణి=శుభములను । యచ్ఛతి=ఇచ్చుచున్నది॥

తా॥ వేదాంతంవారి వంశమున బుట్టుటతప్ప నేమియు యోగ్యతలేని శ్రీరాముడను కవిచే రచింపబడిన యీ నక్షత్రమాల భక్తితో భద్రగిరిరాముల పాదముల సమర్పింపబడినదిగాన దీని జదువు జనులకెల్లపుడును శుభముల నొసగును॥

ఇతి భద్రాద్రిరామ నక్షత్రమాలా.



# శ్రీ హరిప్రియాష్టకం.

1 పులోమజాదిత్రిదశాంగనాకచ । స్థితప్రసూనాళిగణైర్వినాదితం ।
హరిప్రియేత్వత్పదనీరజద్వయం । సదాభవేన్మే శిరసోవిభూషణం ॥

2 మణిప్రభాభాసురభర్మనూపురం । భవాపహంభూసురబృందసేవితం।
హరిప్రియేత్వత్పద నీరజద్వయం । సదాభవేన్మేశిరసోవిభూషణం ॥

3 ప్రవాళముక్తాఫలతుల్యకాంతిమ। చ్ఛుభాంగుళీరమ్యనఖాభిశోభితం।
హరిప్రియే......................విభూషణం ॥

4 శిరాసమూహాహ్ వృతచూతపల్లవం। నఖప్రభాకై తవతోహసచ్ఛివం
హరిప్రియే......................విభూషణం ॥

5 ననాంధృసేవాకరణాత్స్వవల్లభ । ప్రరోచనాయేవసఖోడుసేవితం ।
హరిప్రియే......................విభూషణం ॥

6 సమన్మనస్సంస్థితరాగసంచయాః । పహారహేతోరివరక్తిమాయుతం।
హరిప్రియే......................విభూషణం ॥

7 హృతస్యరాగస్యహిమూల్యమేత । దితీవసత్వంసఖభామిపాద్దదత్ ।
హరిప్రియే......................విభూషణం ॥

8 సరోజసామ్యస్యసదానిరాసనం ।సరోజమూర్థః స్థితితఃప్రపంచయత్ ॥
హరిప్రియే......................విభూషణం ॥

త్రిజగతివిదిత శ్రీ భద్రగిర్యాఖ్యపుర్యాం ।
శ్రుతిశిఖరకుల శ్రీ రామనామాద్విజన్మా।
శ్రుతిశతవినుత శ్రీ భార్గవీదేవతాయాః ।
స్తవనమిదమకార్షీద్భక్తియుక్తోరమాయాం ॥

ఇతి శ్రీహరి ప్రియాష్టకం.

